నించి మించి ప్రా,యశముగఁ గాళిదాసుని సు
శ్లోకవిగా నొనరించినట్టినీ, యశము నుతింతునమ్మ
మహిషా... 80

ఉ. నీరధులేడు నొక్కటిగ నిండినయంతటికన్న మి
న్నయై, పారములేని నీకరుణఁ బ్రస్తుతిఁజేయఁద
రంబె యెరికిన్, సౌరగణాహిజాలమనుజవ్రజసం
చితసంపదాగమ,ద్వారమునీసమర్చమహిషా...

ఉ. చిత్రవిచిత్రవైఖరులఁ జేకొని భక్తుల నావరించి
సర్వత్ర మహాత్మ్యధీత్వఫలవైభవకార్యవిశుద్ధు
లిచ్చుసా, విత్రియు నాసరస్వతియుఁ బృథ్వియు
వైష్ణవియున్ భవాని గా, యత్రియునాఁగ నీవె
మహిషా... 82

ఉ. అంబుధిసప్తకంబు బలమై జలముబ్బి జగద్వినాశ
మైనం బరికించి కంధరమునన్ బ్రియుఁ గైకొని
వారణాసి శూ,లంబుననుద్ధరించి ప్రబలస్థితిశాశ్వ
తవైనశ్రీప్రసూ,నాంబవు నీవు కావె మహిషా...

ఉ. ఏయెడఁ జూచినం గలదె యింకొకప్రాపకమర్థికో
టికిన్, బాయక తల్లివై సకలభాగ్యము లిచ్చువ నీ
వె యీావలెన్, శ్రేయములైన నీవె కులశీలవిశే
షములైననీవె దీ,క్షాయువులైననీవె మహిషా...

ఉ. కొండలపిండుదండిదొరకూఁతురి వై కరివేల్పు

తోడువై, తిండికిమెండుచేదుగలతెల్లనిసామికి
గేస్తురాలవై, దండిగ నాలుగైదుమెయిదాలుపు
కోటులసీటుబూని బ్రహ్మాండమూలేలుతల్లి మహి
మా.... 85

ఉ. ఎంచి తలఁకమెలంగుచెదలేటిని గొంచక మంచు
కొండపై, డించి తపంబుసల్పెడికడిందివిగావున
నీకు సాముమేఁ,బంచెదు వేల్పుడెందమనుపా
లకుళంబున నోలలాడురా, యంచవు సుమ్మునీవు
మహిమా... 86

ఉ. గంగయెడఁ విరాళి యధికంబగునీతని కంచు
నెంచి స,ర్వాంగములఁ సువర్ణనలినాచితిజూపి
సురల్ తరంగలీ,లం గనుపట్ట శూలికిః జలంబో
నరింతువు నీ వగణ్యపు,ణ్యాంగనవాగదమ్మ మహి
మా... 87

ఉ. ఉల్లమెలర్ప నిన్గొలుచుచుండెడిపుణ్యులపట్ల నె
వ్వా రే,ప్రల్లదులై శఠత్వమునఁ బాపపుఁబల్కులు
పల్కుచుండ్రో యా,కల్లరులఁ వధించుటకుఁ గ
న్నెఅసేయకమాన విజ్జగం,బల్లలనాడునట్ల మహి
మా... 88

ఉ. సన్నుతి సేయఁగాఁదరమె చక్కని కాటుకకంటి
చూడ్కి య, త్యున్నతమై కురంగము సముజ్జ్వ

లతం బ్రకటింపుచుండఁగాఁ, బున్నమచందమా
మవలెఁ బొల్చి పయోజములన్ హసించునీ,య
న్నునవనెమ్మొగంబు మహిషా... 89

చ. ఘనమగుమీనరూపమునఁ గన్నులుకూర్మతఁ జేఁ
బ్రపాదముల్, తనరుమృగేంద్రవృత్తి నవలగ్న
మునెన్నిన నెన్న నేమొ య,వ్వనజదళాక్షుఁ డొ
క్కరుఁడు వారల కన్యలకెన్న నౌనె నీ, యనుప
మసౌష్ఠవంబు మహిషా... 90

చ. ప్రకటితవజ్రరేఖగలపాదతలంబునఁ గాసరాసు
రం,గకవికశృంగముల్ నురుముగాఁ దునుమా
డుచుః ద్రొక్కిపట్టి పా,యక మృగరాజునెక్కి
కొలువై యలరారెడినిన్నుఁ బూజసే, యక
యుఁకమాన సుమ్ము మహిషా... 91

చ. హలకులిశాంకచిహ్నితము లంచితవర్తులశుద్ధపా
ర్ష్ణికం, బులు ఘనవిద్రుమోపమసముజ్జ్వలగుల్ఫ
ము లభ్రతారకా,కలితనఖాంకురంబు లభిగణ్య
ములైనభవత్పదంబు లిం, పలర భజింతునమ్మ మ
హిషా... 92

ఉ. దభ్రత యింతలేక సతతంబుభజింతు భవత్పదాబ్జ
ముల్, శుభ్రకళాకలాపపరిశోభితహాస్యముఖా
రవింద యో,విభ్రమహావభావరసవేల్లితసంభ్రమ

శాంభవాత్మ యో, యభ్రసమావలగ్న మహి
షా... 93

ఉ. ఆతతవేదశాస్త్రమహిమాన్వితులై విలసిల్లుకుం
భభూ, గౌతమముఖ్యు లేర్పఱుపఁగానరు నీవిల
సత్ప్రభావ ము, జ్ఞాతను నేను గాంచఁగలనా
దయచేసి కృతార్థుఁజేయు వి, ఖ్యాతికి నీవసుమ్ము
మహిషా... 94

ఉ. నీమహిమంబు లెన్నుటకు నీరజసంభవుఁడైనఁ
బూనలేఁ, డే మనుజుండ సత్యగుణహీనుఁడ దీ
నుఁడఁ బూననేర్తునే, మామకసాపరాధవిధి మా
న్పుటకెల్లను నీదెభార మో, హైమవతీమదంబ
మహిషా... 95

ఉ. అక్కమలాసనాదులకు నైనఁ బరీక్ష యొనర్పరా
ని నీ, వెక్కడ నీయశోజలధియెక్కడఁ దత్తద
గాధశోధనం, బెక్కడ నాకు నెంచఁబడుటెక్క
డ యిట్లు నశక్యసాహసం, బక్కజమౌఁగదమ్మ
మహిషా... 96

చ. హరిహయశాఖిలేఖిని మహాంబుధి కజ్జలపాత్ర
భూతలాం, బరములు సంపుటస్థలులు పంకజసంభ
వమూర్తివక్త్రలే, ఖరిహరిదశ్వుఁ డట్లయినఁగాని
లిఖింపఁదరంబె నీమనో, హరగుణజాలసంఖ్య మ
హిషా... 97

చ. నిరతము నీకథామృతము నిశ్చలతన్ భజియింపఁ
గంటి నీ, చరణసరోరుహంబులకు సాగిలిమ్రొ
క్కులిడంగఁగంటి నీ, పరమదయారసప్లుతికిఁ బా
త్రుఁడనైతి నిఁకేమిశంక నా, కరయఫలించెఁ గో
ర్కి మహిషా... 98

చ. నిను వినుతింతునంచు నొకనిక్కపుమిక్కిలిసత్క
విక్రమం,బునఁ బనిపూనినాఁడఁ జలమూని పిపీ
లికకొండఁదాల్పఁబూ,నినగతిగాదె యింతటికి నీ
కృప భక్తులపై సుధారసా,యనమునిజంబునుమ్మ
మహిషా... 99

ఉ. వారిజసంభవాద్యమరవర్గ మనర్గళలీల నీకథల్
ధీరత నాగమార్థఫణితిన్ నిరతంబు గృతుల్ ర
చింపఁగా, నే రచియించునల్పకృతి నీకిది గణ్య
మె యైననఁగాని నీ, కారయ తుల్యబుద్ధి మహి
షా... 100

ఉ. శ్రీరమణీవిశేషగుణచిహ్నితపీవుభసత్కృపాప్తిచే
ధీరుఁడ కశ్యపాన్వయుఁడ దిట్టకవీంద్రుఁడ రామ
చంద్రుఁడన్, గారవమొప్ప వృత్తశతకంబురచిం
చితి దీని సన్మణీ, హారముగా గ్రహింపు మహి
షాసురమర్దని పుణ్యవర్ధనీ. 101

మహిషాసురమర్దనిశతకము సంపూర్ణము.

---

# పీ ఠి క.

సుప్రసిద్ధుఁడు దిట్టకవినారాయణకవి కీశతకకర్త యగురామచంద్రకవి కుమారుఁడు. ఈకవి సమగ్రజీవితము మహిషాసురమర్దనిశతకమునఁ జేర్చియున్నారము గాన నిందు దిఙ్మాత్రముగా నుదాహరించుచున్నారము. ఈ రామచంద్రకవికవిత నిర్దుష్టముగా నిరర్గళధారాశోభితమై మనోహరముగానుండును. ఇతనిగ్రంథము లింతవఱకు మా కీక్రిందనుదాహరించినవి మాత్రము లభించియున్నవి. ఇంకను బ్రయత్నించినచోఁ గొన్నిగ్రంథములు లభింపవచ్చునని నాసగలదు. 1.మహిషాసురమర్దనిశతకము, 2.గొట్టిముక్కులరాజగోపాలశతకము, 3.ఉద్దండరాయశతకము, 4.రఘుతిలకశతకము, 5. వాసిరెడ్డివారిచరిత్రము, 6. హేలావతిదండకము, 7. చాటుపద్యములు.

రామచంద్రకవి చిరకాలము వాసిరెడ్డివారిసంస్థానమునందు వేంకటాద్రినాయఁడువారి కాస్థానకవియై యుభయభాషాపండితుఁ డని పేరుగాంచెను. ఇతనిచాటుపద్యములఁ బట్టిచూడఁ గాలక్రమమున నాకాలమునఁ బేరుపడియున్న వెలమసంస్థానములన్నింటిని జేరి ధనార్థియై రాజాశ్రయముతోఁ గాలముగడిపినటుల ద్యోతకము కాగలదు.

ఉద్దండరాయశతక కర్తయగు దిట్టకవిరామచంద్రకవి యిప్పటికినూరుసంవత్సరములక్రిందట నుండియుండును. ఇంతవఱ కీకవిగ్రంథములుగాని సుప్రసి

ద్ధమగునామముగాని యాంధ్రలోకము ఎఱుంగ కుంట పరితాపకరము.

రామచంద్రకవి నూజవీటిప్రభువుల సంస్థానము లోనిదగు మద్దాలి కేఁగి యటఁ గలయుద్దండరా యస్వామినిగూర్చి యీశతకమును రచించెను. శత కమునందు భక్తిరసము ప్రధానస్థానమునొందియు న్నది. శతకమంతయు జకారప్రాసముతోనున్నప్రాస స్థానములలోఁ గవివెదకికొనక త్రొత్తపదములను సంద ర్భశుద్ధిగా సమకూర్చి తనకవితాప్రాగల్భ్యము వెల్ల డించియున్నాఁడు. ఈశతకమునందలి పద్యభావము లుగూడ మనోహరభక్తజనహృదయాకర్షణముగాను న్నవి. ఈకవి సాహిత్యమందేగాక యద్వైతమతసి ద్ధాంతములందుఁ గూడ జితశ్రముఁడని యీశతక మునందలిపద్యములు చెప్పుచున్నవి.

మాకుఁ బూర్వతాళపత్రగ్రంథమును బట్టి వ్రా యఁబడినవ్రాఁతప్రతి జీర్ణమయమైనది లభించినది. ఇంక నుపేక్షించిన నీప్రతిగూడ నదృశ్యమగునేమో యని ప్రత్యంతరసహాయము లేకున్నను ఎటులో శుద్ధ ప్రతి నొకవిధముగా సిద్ధపఱచి ముద్రణమునకు నొ సంగఁగలిగితిమి. ద్వితీయముద్రణమున శతకమును సర్వవిధముల సంస్కరింపవలెనని యున్నది.

నందిగామ. }
5-2-25 } ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీ ర స్తు.

డిట్టకవి రామచంద్రకవికృత

# ఉద్దండరాయశతకము.



మ. అజకాంతన్ భజియించి భాగవతులం బ్రార్థించి
దండంబునన్, గజవక్త్రుం బ్రణుతించి తొంటికవు
వ్రలం గైవారముల్ చేసి ప్రేమ జూహా
హ్లోహా రటంచు సాగిలి మొదన్ మద్దాలి యుద్దం
డరా, య! జయ శ్రీసువిధేయ! భక్తజనగేయా!
నిత్యభాగ్యోదయా. 1

మ. త్రిజగత్పూజ్యము లైననీపదము లర్థిన్ సేవ
గావింతు నిన్,భజియింతున్ నిరతంబు మ్రొ
క్కుదు మదిన్ భావించి కీర్తింతు స్వామి జసంర
క్షక విశ్వాకారక హరి మద్దాలి... 2

మ. భుజముల్ ఫాల మురంబు చేతులు పదంబుల్
భూమి మోయంగ సాగి జలూకాగతిచే
బ్రణామశతముల్ గిలింతు గైకొమ్ము ప్రేమ
జెలంగన్ భవదీయదాసుఁడఁ జుమీ మద్దాలి...

మ. ప్రజకాంతాహృదయేశ సన్మునిజనవ్రాతాత్మసం
వేశ నీరజరాజధ్వజపోషితేంద్రజనిరూఢప్రా
భవోపేత ధరాజరాజ్యప్రతిపాదనాత్మయుత
శ్రీమద్దాలి... 4

మ. సజలాంభోధరతుల్య నైల్యకలనాచంచత్తనూ
ధామ శాన్యజితాముర్త్యవిరోధిభూమ విధిము
ఖ్యాదిత్యనక్షత్రసోమ జటిప్రాతనుతైకనామ
వహామాం మద్దాలి... 5

మ. భజనీయైకమహాపిదంబర పదాంభస్సిక్తహే
మాద్రి ధన్విజటాడంబర కాంచనాంబర సదావి
శ్వంభరా గోపసా, మజయానాహృదయాబ్జబం
భర నమో మద్దాలి... 6

మ. అజగవ్యర్చిత మానిచర్చిత సమస్తాదిత్యసంప్రా
ర్థితా, సుజనారాధిత తత్త్వబోధిత ముముక్షు
స్తుత్యశోభా పులో, మజిదశ్మప్రభ యుగ్రసేన
సులభా మద్దాలి... 7

మ. ద్విజరాజాంబుజమిత్రనేత్ర సకలాధిష్ఠానహృ
త్పాత్ర వారిజసంభూతనిజాగ్రపుత్ర కరుణా
బృందిష్ఠచారిత్ర వ్యోమజటాజూట సదాత్మ
మిత్ర నృహరీ మద్దాలి... 8

మ. రజనీవల్లభభానునేత్ర త్రిజగద్రాక్షిష్ఠచారిత్ర

సీ,రజగేహైకకళత్ర భవ్యగుణపాత్రా నన్ని
కఁ నీచక, ర్మజనత్వంబులఁ బాపి ప్రోవఁగదె శ్రీ
మద్ధాలి... 9

మ. ద్విజరాజధ్వజ సన్నుతించిత సభావేదీప్యమానా
త్మ దేవ జగన్నాథ సుకుంప మాధవ హరి
వందారుమందార స,మ్మఁజనుఁ నిన్ను దయామ
యాత్ముఁడవయా మద్దాలి... 10

మ. గజరాజ ప్రముఖ నాకుఁగన్పడవె నేగన్గొందు నీపా
దపం,కజముల్ నీపురనారవిందమును నీక
న్దమ్ములుం గావుసో, పుజయందాదుల గేరుచ
క్కదనముఁ మద్దాలి... 11

మ. రజతస్మోధర గేహసాయక భవద్రాజత్ప్రభా
వంబు ల,క్కజముల్ ద్రౌపదియార్తిచే సరసి
జాక్షా యన్నమాత్రాన ప్రముదిగుల్లోత్తుఁగ
మానము న్నిలిపితే మద్దాలి... 12

మ. అజహాత్ప్రాభవ తెల్పవే స్మృతి యవిద్యారూ
పపుంసనువా, లజోదం వృష్టికి నంతరంబిడదు
తల్లోపంబు లేకున్న భీ, మాజరాయుఃగ్రథనంబుజీవు
నకగుఁ మద్దాలి... 13

మ. విజయక్షేమదసీదయంగద దయావిఖ్యాతిసంసా
రవ, త్రుజపంకాంబుధు లింకిపోవుటకు నీసంసేవ

పేరింటి గ్రీష్మజగత్ప్రాణము కారణంబుగద
శ్రీమద్దాలి... 14

మ. వ్రజముఙ్ దాఁకుస ముజ్జగించి సినుఁ జీరం
దారిగల్పింపవే, రుజకాధారము పూతిగంధల
హారిరూఢంబు జంత్రంవుబో, మ్మజామీదేహ
ము దీనినమ్మఁదగునే మద్దాలి... 15

మ. అజరుద్రాదులు నిన్నుఁగొల్తురమరుల్ ప్రార్థిం
తురేప్రొద్దు నెల్లజగంబుల్ సృజియించుకర్తవు
దయాలంకారచిత్తుండ వాత్మజతుల్యంబుగనన్ను
బ్రోవుము కృపఙ్ మద్దాలి... 16

మ. వృజినంబుల్ హరియించి నన్నెపుడు సంప్రాప్తా
త్ముఁ గావించి నిఙ్, భజియింపఙ్ మతిబుట్టఁజేసి
కృపచేఁ బాలింపవే చందమామ జగిం జేకొని
కల్వమొగ్గవలె శ్రీమద్దాలి... 17

మ. త్యజియింతుఙ్ భవబంధముల్ మనములో
నర్చింతు నీపాదముల్, విజయంబందుదు మోక్ష
లక్ష్మివలనఙ్ వేమాఱు సంగ్రామకర్మ జరాసంధ
మదాపహారి నృహరీ మద్దాలి... 18

మ. గజఘోటీ ముఖసంపదల్ సతములా కా వీశరీ
రంబులే, నిజముల్ వ్యర్థములంచు రోసి మును
మున్నె యైహికాగమ్యకా, మ్యజగీషఙ్ భజి
యించి కాంచవలె నిఙ్ మద్దాలి... 19

మ. సృజియింపన్ సృజియించి మేలొసఁగ నిర్జింపం
బ్రజామానసాం,బుజవాంఛల్ సఫలం బొనర్ప
విఫలంబుంజేయనీవేని కా,మజగద్భారకమూల
కర్తవు భళీ మద్దాలి... 20

మ. సుజనత్వంబరిదేహిమత్తుఁడయి సంక్షోభింపఁగా
నేల ని,త్యజుగుప్సాస్పదమాజవంజవసుఖం బా
హాభవద్దివ్యనా, మజపం బేమర కాత్మనిల్పవలె
శ్రీమద్దాలి... 21

మ. యజనామ్నాయతపోజపవ్రతము లత్యంతంబు
వర్ధిల్లభూ,వ్రజ కానంద మమందమై పరగి సంప
త్పారిజాతంపుఁగొ,మ్మ జిగుర్పంగరుణించుకర్తవు
గదా మద్దాలి.... 22

మ. గజ మేదేశికునొద్ద శిక్షఁగనె సాకల్యంబుగాఁ
గుబ్జ యే, ద్విజు నాచార్యునిగాఁగఁజేకొనె భవ
ద్దివ్యామృతప్రాయ నా,మజపప్రాప్తికి సాత్వికంబె
గురువౌ మద్దాలి... 23

మ. అజనుఃశ్లాఘ్యసుఖంబు గైకొనెద భూయఃస్వా
యదానందనం, దజనీసత్వగుణస్ఫురత్స్ఫటికర
త్నంబందు మతూర్వక, ర్మజపారోచులలోఁ
గొనంగదవె శ్రీమద్దాలి... 24

మ. ధ్వజమై వాహనమై పతంగపతిగొల్వన్ బిల్వ

రా సెజ్జయందు జరీపుట్టముగట్టి కౌలొన్వ
తోడ్తో చెంగటం గల్మికొమ్మ జత్రై నిల్వ జ
బులేలుదువు శ్రీమద్దాలి...

మ. యజమానత్వమొసంగి జ్ఞానశిఖియం దత్యం
త్కల్బిషం, బజరూపంబుగ వేల్వఁ జేసి
త్వదీయాంఘ్రిద్వయీభక్తిసో, మజలంబాని
త్రమూర్తినగుదున్ మద్దాలి...

మ. వ్యజనచ్ఛత్రముఖోపచారకలన వ్యాపార
భక్తి వి,శ్వజనుల్ గొల్తురు నిన్ సహేం
సురల్ స్వర్గంబునందున్ బులో,మజతో ని
నివోలె నుర్వీరపయిన్ మద్దాలి...

మ. ఇజగుంజెంది కుచేలుఁ డర్థియయి నిన్నీక్షింప
తేరఁ ద,ద్ద్విజవర్యున్ ఫలితార్థుజేసితివి నిన్
హీయనన్ నీశుభా,త్మజతుప్రాయముగాఁ గ
గుటరుదే మద్దాలి...

మ. నిజమాయన్ విధి వే గలంపఁ గలఁడే యింత్ర
త్మతన్ నీవు వే,సృజనల్ చేసితి వెల్లవత్సవ
నిన్ శీలింపఁగా లేక బ్ర,హ్మా జితప్రాభవుఁడ
మత్తుఁడగుదున్ మద్దాలి...

మ. అజమీళుం డొకవిప్రదాసియెడ రత్యాస
దై కాలమెం,తజనంగాఁ దుది మోక్షమిచ్చి

యోనా రాయణాయంచు నాత్మజునిం జీరినదాన
శ్రీతమతివై మద్దాలి... 30

మ. విజనంబైనమహాటవిన్ శబరి యావిర్భూతస
ద్భక్తిచే, భజియింపన్ ఫలమీయ దానికిడవే
పుణ్యంబు శ్రీరామనా, మజనాధీశ్వరరూపధే
యమున ముక్ మద్దాలి... 31

మ. నిజమానానసాభిమానుఁడవయా నీ వాజిలో
సోమద, త్తజకేలూడిచి సాత్యకిన్ మనిపి తత్యం
తంబు పాలింపు సా, మ్యజనింపంబడియున్న వేళ
కృపవే మద్దాలి... 32

మ. భుజవిస్ఫంబున ద్రోణిసుతవధ్యకై బూనంగ
నీవెన్నిభూ, భుజులట్టుంచెఁ దోలంగఁదెచ్చితివి
నిన్ బూజించువారౌట ధర్మజభీమార్జున మద్ర
సూనులఁ బ్రోవన్ మద్దాలి... 33

మ. బుజాతత్త్వం బెఱిఁగిన్ వహించు సఖులు నాభృత్యాత్తు
గాఁ గూల్తువో, రజకుం దూడుట మల్లులీల్గుట
మదారంభంబు చేడాగి సా, మజముం ద్రుంగుట
కంసమూలమునుగాదా మద్దాలి... 34

మ. కుజనుల్ నిన్ను భజింపలేక తమదోర్కుల్ వేరు
గా గేరికే, రిజవుంబల్కులు బల్కుచుం జెడుదు
ర్దర్పన్ నారకావాసమ్ ,మజలూకావృతదేహుఁ
డై పరమునన్ మద్దాలి... 35

మ. రజతస్వర్ణముఖాఖిలార్థకృతగర్వగ్రస్తులై మత్తులై, బొజుఁగుల్ నిన్ భజియింపలేక తనువుల్ బోవన్ దమం బాత్మఁ గ్రమ్మ జముం జేరుదు రెన్ని జన్మములకున్ మద్దాలి... 36

మ. అజరాధీశ్వరుఁ డైననీకు పరిచర్యల్ సేయఁ బ్రాల్మాలినం, బిజుగొట్టైన్ దుడిమ్ముట్టఁ దజ్ఞునకుఁ దద్విజ్ఞానహీనంపురి, మ్మజెనన్ నిన్ భజియింతు రాషధమింకన్ మద్దాలి... 37

మ. అజనాపాథకమండలుల్ గమిగ ధర్మాయత్తులై గౌతమీ,త్రిజగత్కారముఖాఖిలర్షులు వినున్ బ్రేక్షింపఁగా లేరు ధ,ర్మజఘూంసుల్ దరిముట్టు టెట్టులొ యింకన్ మద్దాలి... 38

మ. కుజముల్ రాజసతామసంబులు త్వదంఘ్రిల్ గూర్చు మన్మానసాం,బుజ మేటోలుఁ; పునర్భవైల బిలతుర్గోత్కంబు తన్వాప్తియు,గ్మజయత్వంబు వహించి సల్పఁగదె శ్రీమద్దాలి... 39

మ. గుజుగుంట్లం గడతేర్పలేని వెడకోర్కుల్ గోరుటల్ వట్టిభే,షజముల్ నీటనశింప దక్షత భవత్సంసేవసిద్ధింపుజా, ల్మజనశ్రేణికతత్క్షణత్రామయమరున్ మద్దాలి... 40

మ. అజరస్థాపితకల్పకంబవయి కుయాప్యోక్తింపవే యా

యథో,త్కజ నిన్నే నెదనమ్మినాఁడ నీక మత్కాలు
ష్యముల్ బాఱఁజి,మ్మ జుగుప్సల్ బెడబాప
కర్తవు జుమీ మద్దాలి... 41

మ. గజవక్త్రుండు భుజంగమాధిపతి గంగాద్వీపినీభ
ర్తనీ,రజసంజాతుఁడు భారతీసతియు నీప్రాంచ
త్కథల్ ప్రేమసా, మజటాగానములన్ భజింతు
రెపుడున్ మద్దాలి... 42

మ. యజురాదిశ్రుతులెల్ల నిన్ బొగడు నాహాయంద్రు
నీకీర్తి క,య్యజుడున్ భారతి నీదుతారకము
జిహ్వాగ్రంబులన్ మేనకా,త్మజయున్ శంభుఁడు
దాల్చి పొంగుదురు శ్రీమద్దాలి.... 43

మ. విజితత్వంబున నొంద దీషణదవావిర్భాతి
యోహేలాచతు, ర్భుజ తచ్ఛాంతికి తావకీనకరు
ణాపూరంపుఁబాలేటిచె, మ్మజుమీ నమ్మినవాక్షి
కాంబుద మిఁకన్ మద్దాలి... 44

మ. గిజిగాడెట్టులొ యట్లజీవుఁడును దద్గేహంబె దే
హంబు త,ద్విజ మాలోపల జ్యోతినుంచుకొని
యుద్దీపించునట్లే యజి,హ్మాజగజ్జ్యోతినినిన్నుఁ గాం
చవలెలో మద్దాలి... 45

మ. గజగండస్థలివోలె నెమ్మన మశక్యంబైన దుర్వాం
ఛవే,రిజిలందూలెడుదీని మాన్పభవదంఘ్రిస్వర్ధు

మూలైకసీ, మజవాక్సృష్టికి నందసీయఁగదె శ్రీ
మద్దాలి.... 46

మ. గజపుష్పాంచితదివ్యదామములతోఁ గల్యాణచే
లంబుతో, భుజకీర్తుల్ మొదలైనసొమ్ముగమితోఁ
బొల్పారునీలంపుబో, మ్మజిగిన్ గన్పడవయ్యె మ్రొ
క్కులిడెదన్ మద్దాలి... 47

మ. స్వజనుంగా గరుణించి నీస్మృతుల కస్మన్మాధచే
తఃపశు, వ్రజముం జేసి యొసంగవే యిపుడు
ప్రత్యక్షంబు తాపత్రయో, ష్మ జెడన్ త్వత్పదదర్శ
నాప్తి మనెదన్ మద్దాలి... 48

మ. అజపుత్రాదిమునుల్ భవన్మహిమ మేకాంతం
బుగాఁ గాన నో, టజముల్ జేరి జపించి కాన రతి
దౌష్ట్యప్రక్రియాలబ్ధపా, ప్మజడీభూతుఁడ నేను
గాంచఁగలనా? మద్దాలి... 49

మ. అజరద్వీపినిగన్న పాదకమలం బాసించితిన్ జూప
వే, రజనీనాయక సోదరీరమణ యో రాజీవపత్రా
క్ష న, మ్మజుమీ దృశ్యము నశ్య మైహికమునన్
మద్దాలి... 50

మ. అజకంఠస్తనమై పరోపకృతిసేయన్ లేని మద్దేహ
యష్టిజనింపన్ ఫలమేమి దీనిఁ గవిన్ సేవింపఁ
గై కొమ్ము జన్మజుగుప్సం బెడబాసి సార్థకముగన్
మద్దాలి... 51

మ. రజనిం జోలె యవిద్య నెమ్మదికి నిద్రంగూర్చు
విద్యాసమృద్ధి జగచ్చక్షుఁడపోలె తెల్వినిడుఁ
దవిజ్ఞానహైన్యత్రియా, మజనంజేయవె తెల్విఁ
గైకొనియెదన్ మద్దాలి.... 52

మ. విజిఘుత్సుత్త్వము సద్గురుప్రభవ ముద్వీతంబుగా
నూతనాం, బుజసౌందర్యము లైననీదుపదముల్
బూజింతుఁ గారుణ్యభూ, మిజలాసారము నాప
యిన్ గురియవే మద్దాలి... 53

మ. అజ నీవర్ణనమబ్బు టెప్పుడో యనేహాస్తోత్రమం
తంతడో౦, కి జరంగెన్ గనుపట్టు నిప్పుడయినన్
గీర్తించి మైనిండభ, క్త్మజలం బుబ్బ ప్రవింప మొ
క్కులిడెదన్ మద్దాలి... 54

మ. సుజనుంగాఁ గరుణించి నామదికి సంశుద్ధిం బ్ర
సాదించి లో, కజనన్యాశ్రయ వత్సవత్సశకటా
కారాసురద్వాదశా, త్మజరక్షింపవె మోక్షదాత
వయి శ్రీమద్దాలి... 55

మ. ప్రజిహావల్లికి సాంఘుఁ దోరసిలు తేవన్ గర్వికిన్
సిపుగా, వు జగత్పూర్ణుఁడవనన్య సాధుగుణాభ
వ్యుం బ్రోతు సజ్ఞానధూ, మజగన్నాథుఁడ నెట్లు
బ్రోచెదవో నన్ మద్దాలి... 56

మ. అజశృంగీకితవార్క ముష్టిఫలవాంఛాయోగ్య

సంసారమా, ధ్యజదుర్వాంఛలుమాన్పి యొ
క్కయెడ వేడ్కంబోలె నీదివ్యనా, మజప
బూనగ బుద్ధినియ్యగదె శ్రీమద్దాలి... 57

మ. గుజుగుంట్లెంతయుదీరకై హికపుసంకోచంబు చేత
గజీబిజిగా చింతలె పుట్టసాగనిం నిక బేర్కొ
టకె ట్లిట్టిచ, ద్మజుగుప్సం బెడబాపి సాంగదె
శ్రీమద్దాలి.... 58

మ. గజబంధి న్నృపమానమై యిహా మసౌఖ్యప్రాప్తి
నొందింప సా, గె జుగుప్సంబడ జాల నింక భవం
ఘ్రిద్వంద్వసేవానికా, మజగన్మోహనబుద్ధి నాకొ
సగవే శ్రీమద్దాలి... 59

మ. భుజమధ్యంబున లచ్చి పార్శ్వయుగళిక భూ
మీళ లుప్పొంగ భ, క్తజనుల్ గొల్వంగ నోల
గంబమరునిక గన్గొందు గన్నార బో, మజటా
జూటనుతాత్మ కన్పడగదే మద్దాలి... 60

మ. గజమె ట్లట్లుగనేను కర్మఫలనక్రగ్రస్తతక బొం
ది యా, ధిజబాధంబడియున్న వాడ కరుణాధీ
నుండవై భావిజన్మజుగుప్సాతవస్థ బాపగదె
శ్రీమద్దాలి... 61

మ. వృజముస్మన్నుగశుద్ధిదేలిచెద సామీ యొమిం
కక నీమహా, భజనాగాంగఝరీసంబోసగవే

బల్మాలుమత్కల్మషా, త్మజపత్ప్రాళనమాచరించు
టకునై మద్దాలి... 62

మ. భజమానత్వదుపాస్తిమగ్నమతినై భావిలినట్లున్
సదా, భజనత్వం బొనఁగూర్పనయ్య సుమనోబం
హిష్ఠ సత్కృత్తిన, ర్మజద్ధైర్యంబున ధిక్కరించన
యముఁ మద్దాలి... 63

మ. విజితాయాసముగాఁగఁ బంచవయు నిర్వేధాప్తి
గా జీవనం,బు జగద్వందితయుష్మదంఘ్రిభజనా
పూర్ణంబుగా నిర్మలా, త్మజటిప్రాతనుతాత్మ నా
కొసఁగవే మద్దాలి .. 64

మ. గిజిగిట్లాడెడిదీనతన్ బరులకై కేల్సాచు కాపా
సీ,కు జత్తైమ్రొక్కుడు దీనికిత్తిరిపవుంగోరాట
ముఁ పేరి పా, మఁబరాయించుటమాన్పు ప్రము
క్కులిడెదన్ మద్దాలి... 65

మ. విలసత్ క్షీరరసానుభూతివలె నీవిఖ్యాతివర్ణింప
నిం, పుజెలంగన్ దయచేసి నిల్పఁగదె నాబుద్ధిం
జిదానందధా,మ జగత్సన్నుతనామ శాశ్వత
తమా మద్దాలి... 66

మ. భజనాభావుఁడనౌట నటించకతుగా భావింతువే
మోసమ, స్తజగత్కృత్తపు నీకు కెవ్వేసిగిలఁడాసర్వం
బు నీసృష్టియా,త్మజుఁగాఁగా కానకున్న దిక్కుగల
దా మద్దాలి... 67

మ. కుజనాఖ్యారుఁడ నేను నీవు సనను క్రోశప్రభావుం
డ వింక జడత్వం బెపలించి నాకునిధిపై కన్పట్టి
ప్రాకృష్టక, ర్మజనుంగాఁ గనుఁగొంపకున్నఁగలదా
మద్దాలి... 68

మ. అజఘన్యత్వదుపాస్తినాకోసఁగవెయ్యాత్మేశభూాన
హ్నావా,యు జలాకాశగుణాన్వితంబయిన యీ
యుచ్ఛిష్టదేహంబుక, ర్మజమే నిత్యము భక్తిని
త్యధనమే మద్దాలి... 69

మ. నిజమొప్పారఁగ నాదుకందోవకు నానైయ్యంబు
పేరింటనా,స్వజకోరంబునకుఁ న్నదీయవ్యాదయం
భోరాశికిఁ జందమా, మజామీ నీపదపద్మ నన్ను
నమిఁకఁ మద్దాలి... 70

మ. భజనీయాత్మక నావిశుద్ధి వివరింపం బుద్ధి స
న్నాసిరీ,తిజామీ నిన్ను నెఱుంగఁదోఁచునేడఁ
గీర్తింతుఁ సదావేదుజా,ల్మజనుండఁ ద్వద
నుజ్ఞయెట్టులో యింకఁ మద్దాలి... 71

మ. వ్రజముల్ గూడుక గోపగోపికల నిర్వ్యాజైక
భక్తిఁ బలా,నుజ నీసేవలానర్పు భాగ్యమున
కెన్నోనోఁచిరో జన్మజ,న్మజఘన్యత్వము బాసి
భాసిలుటకై మద్దాలి... 72

మ. కుజరూపంబుల నేమినోచెనాకోనీకుం గానలోను

లకుఁ దత్పుణ్యంబు నీకెత్తుని, మ్మజిగుల్లోత్తిఫలిం
చునట్టులుగదా మద్దాలి... 78

మ. వ్రజముఖ్యుం డొకఁ డేకతంబ తనకుఁ వాలా
యమై నెమ్మనం, బు జెలంగం బొలిగద్దనెక్కిన
దొరా బోనేతురమ్మన్న యా,మజతై రాఘుజియిం
పవత్తువంట శ్రీమద్దాలి... 79

మ. భజనాభావమతిఁ మదాంధులయి సంపన్మోహ
బుద్ధిం గిజా,గిజ నెన్నాళ్లును దన్నుకున్నఁగలదే
క్షేమంబు సంసారశ,ర్మజనశ్రేణుల కూర్ధ్వసిద్ధి
వలనఁ మద్దాలి... 80

మ. అజరాస్థానవిలాసినీ రతిసుఖవ్యాపాదనవ్యక్తవి,
శ్వజిదాదుల్ భవదంఘ్రిభక్తివలె మోక్షశ్రీద
ముల్గావు నో,మజనుఁ నీపదసేవ సువ్రత
ముగా మద్దాలి... 81

మ. యజనంబుల్ పదివేలుచేసిన యనిత్యైంద్రాశ్ర
యంబింతె కా,ని జనిఁ మాన్పదులోకమబ్బదు
తదున్మేషంబు నిఁ గొల్వఁబ్రె,మఁ జిగుర్కొన్న
యనంతరంబునఁగదా మద్దాలి... 82

మ. ద్విజుఁడైనం బ్లవుఁడైనఁగాని వినుగీర్తింపం బ్రపు
ణ్యాత్ముఁడౌ, కుజనత్వంబున మత్తుఁడై సిరులు పె
క్కుల్గల్గి కౌసుంభరో,మజముల్ గట్టినపుణ్య
మూర్తియగునే మద్దాలి... 83

కరరూపజతేజంబున వెల్గఁజేసెదు భవద్భావంబు
వర్ణింపఁ బ్రహ్మజుండైనన్ భవుఁడైన నోపఁగ
లఁడా మద్దాలి... 89

మ. భజనీయైకనిగాఢహుంకృతులు సంభావించి వం
దారువాగ్మిజనశ్రేణికి విద్యలిత్తువు హయగ్రీవా
కృతిన్ నీవు సా, మజచర్మాంబరపూజితాంఘ్రి
యుగళా మద్దాలి... 90

మ. విజయున్ భీమునివెంటఁదోడ్కొని రణోర్విన్
భీము చేతన్ గిరివ్రజనాథుం బొలియించి చేసితి
వి నిర్వ్యాజార్థసంసిద్ధి ధర్మజునింగూర్చిటు యు
క్తమాణునిగ శ్రీమద్దాలి... 91

మ. అజరద్భావసుఖోదయాప్తి తనసామ్యైనప్పుడే ని
న్నుపం, చజనుండెంచవలెన్ దదారభటి హ్రస్వం
బైన యుద్ధామభీ, మజరాభారము తోఁచనీయ
దు సుమీ మద్దాలి... 92

మ. త్రిజగంబుల్ భరియించి ప్రోతు వెపుడున్
దేవావళుల్ మెచ్చ నం, డజనుఃకూర్మ వరాహ
సింహ వటురా ట్సంతానజిద్రామ రా, మజిన
శ్రీకలికిస్వరూపములచే మద్దాలి... 93

మ. త్యజియింతున్ జననీకృపారసముచేతన్ భీతతం
బాసి దీ, నజనాధారక నిన్ భజించునెడలన్

నాబుద్ధికిన్ యాతయా, మజమందత్వము నొం
దనియ్యకుము శ్రీమద్దాలి... 94

మ. ధ్వజినీసంగ్రహ మెంత యున్న బహువిత్తంబు
న్న దివ్యాశుగ,వ్రజమున్నన్ దనవెంటరాదు య
మునోర్వీన్ రాదు నీదివ్యనా, మజపం బిచ్చినదా
న సర్వసుఖమే మద్దాలి... 95

మ. భుజగాధీశశయాన యానవిజితాంభోజాత శ్రీ
మద్గదా, గ్రజ మన్నామకతర్ణకంబలర నీకారు
ణ్యపుంబాల గు,మ్మజడిందేల్పవె కామధేనువువ
లెన్ మద్దాలి... 96

మ. ఇజుగుంగూర్చి శరీరయాత్రకయి భూభృత్తీర
ముల్ జేరి చాల జుగుప్సంబడి యుష్మదీయచర
ణాలానంబునం జిత్తసా,మజ మిన్నాళ్లకు నేఁడు
కట్టుబడె శ్రీమద్దాలి... 97

మ. ప్రజనశ్రీ వహియించె మత్సుకృతసంపత్కామ
ధేనూత్తమం, బు జనింపంబడు నీకృపార్భకము
తన్మాలైకనిర్వాణధా, మజసౌఖ్యామృతసిద్ధి నా
కుఁగాదువా మద్దాలి... 98

మ. రజముంబోలె విధూతమై యఘముబాలన్
సన్మనుండై జనుం,డు జరాత్వం బరు దెంచి జీర్ణ

శ్రీ ర స్తు.

దిట్టకవి రామచంద్రకవికృత

# గొట్టుముక్కల

# రాజగోపాలశతకము.



శా. శ్రీభద్రస్థితు లాశ్రితావళుల కక్షీణానుకంపన్
సదా,లాభప్రాప్తులుగా నొనర్చు నజలీలామో
హానాకారమా,యాభీరున్ నినుగొల్చి మ్రొ
క్కుదు నవల్పాకల్పతల్పాయిత, క్ష్మాభృత్పన్నగ
గొట్టుముక్కలపురాంకా రాజగోపాలకా. 1

శా. హేలాసమ్మిళితత్రిమూర్తిరు యహో హేరం
బుఁ బ్రార్థించుచున్, గాళీదాసమయూరమాఘు
ముఖులం గైవారముల్ చేసి నిన్,హాలాయం
బుగఁ బూజసేతుఁ గవనవ్యాహారవిస్తారవా,గ్జా
లాబ్జంబుల గొట్టుముక్కలపురాంకా రాజగోపా
లకా. 2

శా. చక్రీ చక్రిశయాన; యానజితాంచత్పన్నగా
రాపతీ, నక్రగ్రస్తగజేంద్రరక్షణమతీ! నానాప్ర

పంచాకృతీ, శక్రాశ్మద్యుతిసాగరైకవసతీ సన్నె
వ్యాత్పుండరీ, కక్రీడాగతి గొట్టు...

శా. అకలంకాశ్రితసౌఖ్యదాయక సమస్తాజాండభ
డాధినా,యక! యంభోజదళాయతాంబక!విమ
ధావేశ్యమాయావిడం, బక! సాధువ్రజతాప
త్ప్రిబలదృప్యద్దైత్యకాండైకత, క్షక సద్రక్ష
గొట్టు...

మ. వరనాభీజనితాదిశిల్పక! ప్రభావప్రాభవానల్పక
తరితానంతమనోవికల్పక ! యశోదానందకృత
ల్పకా, స్థిరసంకల్పక! వేదజల్పక! మహాశేషాపి
రాట్తల్పకా, కరుణాకల్పక గొట్టు...

మ. పరమాభీరక! భవ్యభారక! మహాబ్రహ్మాండభాం
స్థలో, దరవిస్తారక! విశ్వకారక! యశోదాద
రకా! వేదభూ, ధరసంచారక! సద్విచారక
సముద్యద్భక్తమందారకా,కరుణాధారక గొ...

మ. అజరుద్రాదులు నిన్నెఱుంగుటకు నింతైనక
సమర్థింపలేరు జగత్పూర్ణుండ వన్నిరూపములు
నీరూపంబులై యుండు నిక, భజనం బ్రీణితు
సేయ నావశమె నాభాగ్యంబు నీచిత్త మో,
గజరాడ్రక్షక గొట్టు... 7

మ. అసమప్రౌఢి సితాసితద్యుతుల నెయ్యంబారగా

రామకృష్ణసమాఖ్యాయుతులై జనించి యదువం
శస్వామిలో మిమ్ముఁ బ్రద్యసమృద్ధిన్ భజియింతు
దంభహారిరూపారంభ! సంపుష్టరాజసనాథార్భక
గోట్టు... 8

మ. సురలానందము నొంద నందునకుఁ జతుఃప్రీతి
గా; గోపమంద్రిరసీమన్ పసికందువై వెలయు
మీఁదివ్యామృతాకారవి, స్ఫురణన్ గన్గొన
నేమినోఁచిరో మహాశూద్రీమణుల్ చింతలే,
క రమానాయక గోట్టు... 9

శా. సారోద్ధారపునూనెలంటి, పునుగుం జవ్వాది
మైనూన్చిపన్నీ రాపై జలకంబొనర్చి కృపనెంతో
గోపికల్ మిమ్ముఁ గన్నారం గాంచుట కెంతభా
గ్యమొకో నందాభీరమాయానరా, కాంతప్రాతిక
గోట్టు... 10

మ. అమరన్ మిమ్మొకపుత్త్రమాత్రులని సఖ్యంబుగా
నూహించి చిత్రముగాఁ బుత్రమహోత్సవం
బులు యశోదానందు లానందభావములోఁ
జేయుట జన్మజన్మకృత సేవానిష్ఠలౌటంగదా, కమ
లాకాముక గోట్టు... 11

మ. జగదీశానులు రామకృష్ణులు ఏకీర్షాభవ్యంచుం
బ్రియంబుగ వాక్రుచ్చుచు మీకు నామకర

ణంబుల్ సేయు తన్నంవభా,గ్యగురుత్వంబు భజిం
పశక్యమె కరాగ్రాంచద్ధనుశ్శంఖచ,క్రగదానందక
గోట్టు... 12

శా. సారప్రౌఢిమ పూతనాస్తనగుళుచ్ఛంబుల్ వడిం
బీల్చి; తద్ఘోరాకారము రూపుమాపినసమగ్రుఁ
నిన్ను సేవింతు; వి,స్ఫారత్తారకనామ...ర్ణఫలక
భ్రాజిష్ణు జిహ్వాగ్రవ,ద్ధారిత్ర్యంబక గోట్టు... 13

శా. హంసల్ జోడుగఁ గుం...డియాడు...తి నందాగా
రసీమఁ వ్రజో,త్తంసుల్ మెచ్చఁగ వాసుదేవయు
గళత్వవ్యక్తిం జిట్టాడుమిా, సంసద్భా...వవిలాస
ముల్ గనుట కుత్సాహించెదఁ జూపవె, కంస
ధ్వంసక గోట్టు... 14

మ. నిరతిఁ మించిన కాకపక్షముఁ తో నిండారువేన
ఘ్వతీ, వరజాంబూనదచంద్రహారములతో వర్ధి
ష్ణులై నందగో, పురవీథిం జెలఁగాడుమిా చిఱుత
రూపుల్ చూపరా వేఁ;సుదా,కరుణావార్ధికగోట్టు.

మ. అలరఁ సువ్రతమెంతజేసిరో వసంతా...మసీ
మఁ జిగు,ళ్లలిఁ మేసెడుబాలకోకిలలయట్లుంబ
ల్కు మిాతొక్కు,లు,ల్కులు చెన్నారఁగ వీను
లఁ వినుటకుం గోపాంగనారత్నముల్, ఖల
దుర్ధర్ష క గోట్టు... 16

శా. భావంబందు మిము౯ స్వవర్ణికులుగాఁ బాటించి
గోపాంగనల్, తీవి౯ బొత్తులనారగించుచు సమ
ష్టి౯ సేవగావించుత, త్కైవల్యంబు నుతింపశక్య
మె సుహృత్సంరక్షణారంభ దీ, క్షావిస్తారక
గొట్టు... 17

శా. భాగై మించినపాలు వెన్న పెరుగుల్ పైమీఁగడ
ల్ గోపక, న్యాగారంబులు సొచ్చి మెక్కుచును
శౌర్యప్రౌఢిఁ గ్రీడించుమీ, నైగారంబు నుతింప
నాకు వశమౌనా దూయమానాత్రగ, ర్వాగ
ర్వాంఘ్రికగొట్టు... 18

శా. ఏమీ యీనవనీతచౌర్యమని తల్లెంతే నివర్తింప
న, మ్మా! మన్నింపుచుటంచు నాపవె విముక్తా
స్యుండవై లోజగత్, స్తోమంబెల్లఁ దనూఘనా
ఘనతటిద్రూపీ భవత్కాంచన, క్ష్మామూర్ధామక
గొట్టు... 19

శా. చాల౯ నీపయిచోరవార్తవిని యిచ్చ౯ నీప
దాంభోజముల్, ఆలంగట్టెను దల్లియంత్రు తత్
చంద్రుల్ నీకునుంగల్గియుం, డ్రా? లీలామయచిత్స్వ
రూపివట క్రీడానాట్యరంగస్థల, శ్రీకాళీయాహి
క గొట్టు... 20

శా. ప్రీతి౯ మద్దు లులూఖలానియతి నుర్వీం

గూల్చి తద్వత్సనం, జాతవ్రాంధ్యవిముక్తిఁ జేసి
తివి నీసామర్థ్య మార్యావన, ఖ్యాతిఁ బ్రీతము చక్ర
భానుపరిధూతామర్త్యవిద్వేషిసం, ఘాతధ్వాం
తక గొట్టు... 21

మ. గరిమం గోవులు గోపబాలకులు చోక్కంబొంబ
లంబొసిరుల్, బురణింపఁ వసికేఁగుచో దారత
నంబుఁ జప్పదాయఁ నిజం, బరయఁ గొల్లఁ
డవై వనాఁడును హింసణ్యాత్మకయార్తైకసూ, కర
తాభూమిక గొట్టుముక్కల... 22

శా. ధీరప్రౌఢిఖజంతు నాయెదుట సెంలేమాధురీ
సాధురీ, తీరావంబగు పిల్లగ్రోలు ముకుము త్తెం
నా దలం బింధ మిం, పారఁ గప్పడవయ్యా సా
ధుజనతాపాగ్నిచ్ఛటాటోపకృ, త్కారుణ్యోద
క గొట్టు... 23

మ. మురళీనాదవినోదమానురికి సమ్మూంచ్ఛవిషిం
జొక్కుచుఁ, గరమొప్పా నెడు ధేనుకోటియెడ
నీ కారుణ్యపూరం బధం, గుసతఁ నించునితాం
తకుంతల మిళద్గోపావధూళీసము, త్కరపిష్టాత
క గొట్టుముక్కల... 24

శా. కుంజాగారములందు గోపవనితల్ గోపాలకుల్
మీరలుఁ, బుంజంబై వసియించి చల్దికబళం

బుల్ ప్రేమనన్యోన్యహా, స్త్రాంజల్యంతరభక్తిగై
కొనుట లయ్యా వేడ్కకౌనా కర, త్కంజాతాం
బక గోట్టు... 25

మ. పవిత్రుల్యాంబగు పాదసంహతి తృణావర్తుఁ బ
కుఁ వత్సదా, నవునిఁ ఘోటకధేనుకాదిఖలు
లఁ మర్దించి నందాదివ,ల్లవులం బ్రీతులసేయునీ
గుణకథల్ వర్ణింతు హైరణ్యరాం, కవదివ్యాం
శుక గోట్టుముక్కుల... 26

మ. అమరఁ లేఁగల బ్రహ్మ వంచనము సేయఁ వాని
నన్నింటిని నం, దముగాఁ గల్పనసేసి నీవు నలువకు
వంచించి తం ద్రాదిదై, వము నీవేకన యీశ్వరి
త్రితయిలోపతుష్యలాలానభా, క్కమలాధేనుక
గోట్టు... 27

మ. తిరమై గోగణమొక్కనాఁడు వనసీథిఁ పేఁగ
లాడంగ భీ,కరదావాగ్నులు జుట్టుసున్న సుధ
వేడ్కం గ్రోలుచందాన బం,ధురనావాగ్నులు
గ్రోలి గోవులను తద్గోపాలురఁ బ్రోచితా, గరు
డారోహక గోట్టు... 28

శా. నాకౌకస్సమమైన విప్రతతి నానాయాగపంల్
సేయ నీ, వాకొన్నట్లుగఁ జేసి తత్సతులు మృష్టా
న్నంబొసంగఁ శుభో, త్సేకం జెల్ల నొసంగినాఁ

డవఁట నీచిత్తం బమూల్యంబు లో, కైకత్రాణక
గోట్టు... 29

మ. మనుతం గోపకు లింద్రయాగ మొనరింపన్ వారి
వారించి శై,లమవై పూజలుగాంచి గోగణము
నెల్లన్ బ్రోవవా! జాలవ,ర్షముగా కుండ నగేంద్ర
మెత్తి సురలార్వన్ భక్తసంరక్షణా, క్రమసంచా
రక గోట్టు... 30

మ. క్రమమొప్పారఁగ గోపకన్యకలు వస్త్రంబుల్
విసర్జించి య,య్యమునన్ సీరములాడ మ్రుచ్చి
లి తదీయక్షామముల్ గొండుభూ,జముపైఁ బ్రాఁ
కితిపంద్రు గోగణపరీక్షా ప్రక్రియాజాగరూ,క మ
హోవాంశిక గోట్టు... 31

మ. నిబిడాపీతమరందతుందిలమిళిందీగీతకీతిన్ నెరా,
జాబఁగా నీమురళీరవామృతము లెచ్చోఁ వి న్న
గోపీ స్తన,స్తబకంబుల్ పులకింపుచుండు శిఖి
పింఛాలాంఛితాళిప్రభా,కబరిభారక గోట్టు...

శా. ఎంచన్ శక్యమె నీవిమర్శపసి నెందేమేఁతలాశిం
చుచోఁ, బంచాస్యంబులకైనఁగాని తలఁజూపన్
రామి గావింతువా, ప్రాంచద్గోనిచయాభివర్త
నగతిప్రౌఢిన్ స్వవద్ఘంటికా, కాంచీదామక
గోట్టు... 33

శా. ఉత్కంఠన్ వ్రజసుందరుల్ మనములో నూహించ వాంఛల్ సదా, సత్కారించుచుఁ దృప్తిసేతు వట యెంచన్ శక్యమే! నీసము, ద్యత్కారుణ్యము బాణదైత్యబహుబాహాఖండనోద్దండరం, గత్కాండీవక గొట్టు... 84

మ. వలపుల్ నిల్పఁగలేము నీవు గృపమవ్వార్యుండవై మంచులీ, లలుగల్పించెడిగోపకామినులనెల్లం గౌఁగిటం జేర్చి యి, చ్చలుబూరింతువు క్రీడసల్పి; రతికాంతాలోలగోపాంగనా, కలితస్నేహక గొట్టు.

మ. అమరుల్ తాపసు లాగమాంతనిబిడేహన్ గాన లేనట్టినిన్, రమణుల్ గాంచుట కెట్టునో, చిరో మహారణ్యంబు శోధించి సం, భ్రమ మొప్పన్ వినుతి క్రియాముఖరరుద్రాదిత్యగంధర్వయ, క్షసువా రాజిక గొట్టు... 86

శా. శ్రీ రంజిల్లఁగ నీవు నీపిఁయుఁ దనారీరత్న మూర్తిని ప్తారస్నిలసువర్ణమాల్యవిధి రాసక్రీడ లాడించు మీ, తారుణ్యంబు మదిన్ భజింతు వ్రజకాంతా నేత్రనీలోత్పల, గ్లౌరూపాత్మక గొట్టు... 87

శా. ఆవిర్భూతధృతిన్ సుదర్శనసమాఖ్యాహీంద్ర మే తెంచి నం, దావాసంబునఁ జొచ్చి నందుని మహార్థత్యంబుచే మ్రింగ నెం, తో వేగంబున

హానిజంపి కృప నందుం బ్రోవవా మందర,గ్రాహో
ద్ధారక గోట్టు... 38

మ. అమరం గంసనియుక్తఘోటకము ఖేంద్రా రాతి
జాతిఁ సువిక్రమమొప్పార వధించి పుచ్చు
టిది నీకర్తవ్యభారంపుఁ జం, దమెకా! దుర్జనఖండ
నార్థపరిలుంఠత్పూతనాపూర్వగం, గమహానాటక
గోట్టు... 39

మ. తనకుఁ మోక్షసుఖంబునిచ్చుటకు నుద్దామ
స్థితిఁ దోడితె, మ్మనిపంపించిన నాడ్కి నీకడకు
నొయ్యఁ గ్రూరుఁడై యుండి సజ్జను నక్రూరుని
బంపె కంసుఁడు సదాసంచారయోగ్యత్రయీ,ఘ
నశృంగాటక గోట్టు... 40

మ. ధ్రువభక్తిఁ వినుదోడుకొంచుఁ జనియక్రూరుండు
కాళిందియం, దవగాహంబొనరించి తజ్జలమునం
దమ్మేటిమీలీల లుత్సవమొప్పారఁగఁ గాంచె
ఫాలఫలకాబ్జాతభ్రమచ్చంచరీ, కవినీలాలక
గోట్టు... 41

శా. సభ్రాపేతగుణైకతత్త్వమగు సుద్యద్దివ్యతేజంబె
యీ, విభ్రాజిష్ణులు రామకృష్ణులన ద్వైవిధ్యం
బునఁ బోల్చుమీ, సౌభ్రాత్రంబు భజింతు నెమ్మ
ది సుధాసంధానసంతృప్తలే,ఖభ్రూసంసకగోట్టు.

మ. తమకంబొప్ప తిరస్కరించురజకుం దండించి; మే
లైనవస్త్రములెల్లఁ ధరియించినావు మధురా
ద్వారంబునఁ నీవెకా,సముఁడౌ సాంబనిమిత్త
హస్తినగరీసర్వంసహోత్పాటనో, క్రమహాసా
లిక గొట్టు... 43

మ. జిగిరంజిల్లుసువర్ణభూషణములిచ్చెఁ బాయకుం
డింపుసొంపుగఁ బూదండ లొసంగె నర్మిలి
సుదాముం డుజ్జ్వలద్గంధచ,ర్చఁ గడుంగూరిచెం
గుబ్జ మీకుఁ బరమార్థజ్ఞానసంపత్తిచే, ఖగరా
ట్ఘోటక గొట్టు... 44

మ. నరసింహాకృతి దానవద్విపకళానాశంబు గావిం
చునీ, బిరుదస్ఫూర్తికి లక్ష్యమాకువలయాపీడా
దులే? ముష్టికా, సురచాణూరకఘోరదుర్భర శిర
స్థాణాశ్మనిర్ఘాతభీ,కరసంగ్రాహక గొట్టు... 45

శా. దృగ్లోభత్వమొనర్చె నీమృదులమూర్తిస్ఫూర్తి
సంపత్తి ని, త్యగ్లానిఁ హరియించె నీగుణకథా
తత్త్వంబు;నీమాధురీ,వాగ్లీలల్ వినసొంపులయ్యె
మధురావాసప్రజాశ్రేణికిఁ, కగ్లాపంబక గొట్టు.

మ. అనుమానింపక మేనమామయని మోహంబింత
యుఁలేక తా, మునుముఁ ముష్టికముఖ్యమల్ల
పతనంబుల్ విన్నవాఁడౌట యీ,సున గర్జిల్లెడి

సాధుసజ్జనబిఘాంసుం గంసు నిర్జింపవా, కనకత్రా
మక్ష గోట్టు... 47

శా. తాళంబుల్ ధరియించి నారదుఁడు గీతంబుల్
పఠించెఁ శతో, ద్వేలప్రౌఢిమ నాఁటి రచ్చరలు
దోయ్యవీథిఁ బ్రవర్షంబులై, ... లెం బుష్పాలు
కంసహింసనసుఖప్రంబందు రాధాస్పృగా, త్రాలీలా
దిక గోట్టు... 48

శా. కారాగారమునందు నున్న జనవర్గంబుంగటాక్షిం
చి వి,స్ఫారత్వ్రౌఢిమ నుగ్రసేనునకు రాజ్యప్రా
ప్తిగావించి దో,స్సార శ్రీమధురన్వసించితివి చం
చచ్చంద్రికా కారశృం, గారస్మేరక గోట్టు... 49

మ. అమరుల్ మౌనివరుల్ సమస్తనృపతుల్ హ
ర్షింప సంభారక, త్వముచే యాదవసింహులై
మధురలో వర్ధిష్ణులై నిత్యసం, భ్రమముల్ గాం
చుమిముఁ భజింతు మదిలో బ్రహ్మాదిగీర్వాణ
లో,కమహాపూర్విక గోట్టు... 50

మ. పరమామోదధురీణబుద్ధి వను దేవప్రార్థనం జేసి
స,ద్గురుఁడౌ గర్గమహామునీశ్వరుఁడు కోర్కుల్ నిం
డి దైవార నుస్థిరతఁ విమ్ముపవిత్రవంతులుగఁ
జేసెఁ దానసద్యశ్శుభం,కర విజ్ఞానిక గోట్టు...

మ. ప్రవణఁ సర్వజగద్గురుత్వకలనఁ జాటిల్లు

మీరాకున్ మహిమాత్మవమొప్పారఁగ విద్యలెల్ల
గరపెన్ సాందీపుఁ డాచార్యధ, ర్మవిశేషంబున
నెంతవింత గిరిశబ్రహ్మాదిదైవప్రతీ,క్ష్యవిరాడ్రూ
పక గొట్టు... 52

మ. అణుమాత్రంబున దక్షిణార్థమని నిన్ బ్రార్థింపఁ ద
త్సూను మా, రణమైపోయినవానిఁ దెచ్చి గురు
నారాధించునీకార్యసై, ఫణి వర్ణింపఁగ నీప్రసి
ద్ధికి నెఱాపొందార వందారుర, క్షణతాత్పర్య
క గొట్టు... 53

శా. భావంబందు విరోధవహ్ని దహియింపన్ వచ్చి
పల్మాఱు రో,షావేశంబునఁ దారసించిన జరాసం
ధున్ బరాభూతనా, నావైదగ్ధ్యని జేసినావు వ్ర
జకాంతానిత్యకారుణ్యలీ,లావాత్సల్యక గొట్టు.

మ. గుణహీనుండయి తారసించుయవనుం గొంపో
యి యున్మీలితే, క్షణుఁడౌ నమ్ముచికుందుచేత న
తనిం జంపించి తద్భావర, క్షణతుల్ గైకొని
ప్రీతినొందిననినున్ బ్రార్థింతు సన్మానిర,క్షణ దా
క్షిణ్యక గొట్టు... 55

శా. నీపాండిత్యము లెక్కసేయ తరమే నిర్మించినా
వౌ మహా,కూపారంబున ద్వారకాపురము కో
ర్కుల్మీఱఁ దత్సంస్మృతిం, బాపౌఘంబు తొలంగు

౦తత సకలబ్రహ్మాండనిర్మాణదీ, తపోపారస్త్వక
గోట్టు... 56

మ. సరసిజాసనునాజ్ఞ నాత్మతనయున్ సౌదామినీవి
గ్రహున్, వరకన్యామణి నిచ్చె రైవతుఁ డనర్వా
చీనజన్ రేవతిన్, నిరతిన్ శిరికి నిత్యనామభజ
నానిత్యోపకారప్రియం, కరవైమానిక గోట్టు.

మ. కృపణున్ జైద్యునిదోలి తద్విహితుసక్యం జాల
భంగించి శౌ, ర్యపటుత్వంబునఁదెచ్చి రాక్షసవి
వాహస్ఫూర్తిచే రుక్మిణిన్, విపులప్రేమవరించి
నాఁడవు శుభాప్తిన్ గోపికాచిత్తనై, కపరా
స్కంధిక గోట్టు... 58

మ. అరయన్ శ్రీసతులౌట రుక్మిణియు సత్యాజాంబ
వత్యర్కజా, తరుణుల్ లక్ష్మణయున్ సుదంతయు
సుభద్రామిత్రవిందల్ శుభస్థిరతన్ నీసతులైరి
ఘోషనిలయతీరాజ్యధారాదిత, స్మరకాధూ
ర్తక గోట్టు... 59

మ. త్రిజగద్బాధకు నుగ్రదైత్యు నరకుం దీవ్రాజిరం
గంబులో, ధ్వజినీయుక్తముగాఁగఁ ద్రుళ్లడఁచి
తద్బంధీకృతానేకభూ,భుజకన్యామణులన్ వరించి
తివి సంపూర్ణానురక్తిన్ గదా, గ్రజ దైత్యాం
తక గోట్టు... 60

మ. పదియార్వేవురుగోపకన్యకలునుఁ భార్యావ్రాతం
బుఁ శుభాభ్యుదయంబొప్పఁగఁ బుత్రపౌత్రనిచ
యంబుఁగల్గు తత్తత్ప్రియ, ప్రసంసారివి నిత్య
భక్తి నిరతవ్యాసాంబరీషాదిభ, క్తదయాకారక
గోట్టు... 61

మ. అనయంబుఁ నిను పారిజాతకుసుమం బర్థింప
మేలంచుఁ జ,య్యన నింద్రాదులఁగెల్చి తెచ్చితివి
సత్యావాంఛితార్థంబు నం, వనమందారము వల్ల
వీనిచయచేతఃపంజరాంతర్మిళ, ద్ఘనకేళీశుకగో
ట్టు... 62

మ. ప్రసభప్రౌఢిప్రసేనుజంపెనని సత్రాజిత్తు నీయందు
నిం,దస మర్థించినఁ దచ్ఛమంతకనిమిత్తంబేగి యు
గ్రాజిలో, వెసభల్లూకపతింజయించి మణినీ వేయిం
చ్చితా భక్తము, ఖ్యసమాసాధ్యక గోట్టు... 63

మ. సముదంచద్గతి నీవు పాండుసుతపక్షంబైన కౌరు
ణ్యాసం, భ్రమ మేపారఁగ హాస్తినాపురముఁ జేరం
బోవు నెయ్యంపుఁజం,దమువర్ణింపఁ బరం బె! సాధు
జపరిత్రాణార్థచక్రప్రశి, తీమహావక్రక గోట్టు.

మ. ఖచరాధీశ్వరుఁ దోలి ఖాండవవనగ్రాసంబు గాం
డీవిచే, శుచికిఁ దచ్ఛుచిచేత గాండివధనుస్తూ
ణీరముల్ క్రీడికిఁ, బ్రచురంబొప్ప నొసంగఁజే

సినసినుఁ బ్రార్థింతు నంభోరుహా, క్షుచిదానందక
గొట్టు... 65

మ. అనిలో బాణుని శోణిపట్టణమునం దబ్జాక్షుఁ
డీశుం జ, యించెనటం డ్రౌతఁడెనీవు నీవెయతఁ
డక్షీణైకసువ్యక్తు లొ, య్యన మీలోపల హె
చ్చుతగ్గులనికద్దా! సాధుసత్కార్య దక్ష నృహా
ర్యక్షక గొట్టు... 66

మ. త్రిజగత్కంటకు బాణదైత్యు ననిలోఁదీవ్రంబు
గాఁ దాఁకిత, ద్భుజముల్ద్రెంచి యుషాసమేతు
ననిరుద్ధుందెచ్చి యొప్పారునిఁ, భజియింతుఁ
బదపద్మసంజనితశుంభద్వాహినీదిగ్ధభ, ర్గజటా
వాటిక గొట్టు... 67

మ. సరటాకారము మానిశాపకలనఁ సంప్రాప్తమైనం
బరం, పరశోషిల్లుచు నిఁ భజింప నృగునిం బా
లింపవా! కూపగ, హ్వరముంబాపి కృతార్థుజేసి
భళిరే! యార్తార్తపీడానిరా, కరణవ్యాపక
గొట్టు... 68

మ. ఎవరైనఁ మిమునిందజేసిన జయంబెట్లొందుఁ
దా! రాజనం, బువెసఁ మిమ్ముహసించి రుక్మియు
మిముఁ సోల్లుంఠనంబాడి య, ద్వివిదుండుఁ
వళియింపరే హాలధరోద్వృత్తిఁ సురారాతి
శుం, భ్యపనీపావక గొట్టు... 69

మ. యమునం దావసియించుబోటి కిల వ్రయ్యల్ చేసి
రప్పింపఁడే, రమణన్ రాముఁడు లాంగలాగ్ర
మున మీరాజత్వ్రిభావంబు ల,య్యమరశ్రేణు
లకైన నెన్నవశమానా ! సంగరాభంగశా,ర్జ్గమ
హాకార్ముక గొట్టు... 70

మ. నిమిషార్ధంబున సూతునై మిశమునన్ నిర్జించినన్
శౌనకా,దిమునుల్ వేగహలాయుధుం డతని నెం
తేజీవితుంజేసె లో,కము లెన్నన్ నిబిడానురాగ
మున రంగద్రుక్మిణీదత్తహ,త్కమలారాత్రిక
గొట్టు... 71

మ. కురురాజన్యుఁడు భీతినొంద హల మత్యుద్రం
బుగన్ సాచి త,త్పురియొడ్డేర్పడ గడ్డయెత్తె
బలభద్రుం డంద్రు;మీశౌర్యవై,ఖరి మీకేతగు
గాక యొడ్లకగునా కౌంతేయ సద్భోగభా,గ్యస్థి
రమాస్థాపక గొట్టు... 72

మ. అరిభావంబుననైనఁగాని నిను నిత్యంబాత్మఁ
జింతించినన్, బరమానందపదంబు సంభవిలు
కార్పణ్యంబుచేఁ బౌండ్రకుం,డరియై నిన్నె భజిం
చి ముక్తిఁగనె దేహాంతంబునన్ గాలపు,ష్కర
ముక్తేచక గొట్టు... 73

మ. గరిమన్ నిన్ను బరీక్షసేయ భవదాగారంబులన్

జేరి నిర్జరమానీంద్రుఁడు మోసపోయెను భవ
ద్రాఘిష్ఠమాయాసము, త్కరపాథోనిధియందుఁ
గూలి దరిజెందఁగ లేక సాధుప్రియం, కరసంకల్పక
గొట్టు... 74

శా. రంగద్ధర్మజరాజసూయమఖసంరక్షాప్తికై భీము
చే, తం గర్వాంధుజరాసుతుం గెడపి తద్ద్రవ్యం
బుసాధించి ప్రీ, తిం గౌంతేయుల దన్పినాఁడవు
భళీ దివ్యాంగవల్లీమిళ, ద్గాంగేయాంశుక
గొట్టు... 75

మ. పటిమన్ ధర్మజుచేతఁ బూజఁగొనుని న్భర్జించి
చైద్యుండు దుర్ఘటముల్ బల్కిన తచ్ఛిరంబు
సభవారల్ మెచ్చు చక్రాహతిన్, ఘటికామాత్ర
ములోన ద్రుంచితివి నక్రగ్రస్తఖిన్నేభసం, కటని
ర్మోచక గొట్టు... 76

మ. అమృతాంధఃపథగామి సౌంభకపురస్థాభీలసా
ల్వాదులన్, సమదాటోపులద్రుంపవే సుజనతా
సంరక్షణార్థంబు చక్రముసారించి సురావనార్థ
బహుధాకర్తవ్యుడై తేయసం, ఘమృగాఖేటక గొ
ట్టు... 77

మ. చెలువొప్పారఁగ నీకుఁజేరెఁ డటుకుల్ చిక్రోడ
భక్తిక్రియా, కలనన్ దెచ్చి కుచేలుఁడర్పణమొ

సంగన్ వాని కీనేర్చితౌ, పొలుపొందన్ గృపచే
సమస్తవిభవంబుల్ దేవకీగర్భశం, ఖలసన్మార్తిక
గొట్టు... 78

మ. స్ఫుటసద్భక్తియుతాత్ముఁ డైనబహుళాశ్వున్
నిత్యసత్యవ్రతో,ద్భటురాజర్షి నిగాంచిపూజగొని
తద్భావంబునన్ సీవు ప,ర్యటనంబందితివౌర సన్ము
నిమనీషారామ విస్ఫూర్తిసం, ఘటనాచైత్రిక
గొట్టు... 79

మ. అకలంకస్థితి తల్లి వేఁడిన వరం బాలించి పాతా
ళలో, కకృతావాసులతన్మృతార్భకులవేడ్కన్
దెచ్చుసద్యఃకృపా,ర్థికులన్ మిమ్ముభజింతు పార్థ
శుభకృద్గీతారహస్యప్రసం,గకళాబోధక గొట్టు.

మ. కుహనామానితవచ్చి యాదవులగై కోకన్ సుభ
ద్రన్ మహా,స్థహుఁడై చేకొని పోవునర్జునుని
సన్మానించు నీసౌహృదం,బహహా! యెన్నఁదరం
బెహంసడిభకానోన్యఘ్నతాహేతువి,గ్రహస్ఫూ
ర్త్యాయిక గొట్టు... 81

మ. అబలాగర్భము గావబూని యది గాయన్
లేమికిన్ రోసిబా,డబుడెగ్గాడిన మాన్పి తత్సుతు
లజాడల్ జూపి సత్కీర్తినొం, దబడెన్ పార్థుఁడు
నీసహాయపటిమన్ దైత్యఘ్నతోదృష్టవి, క్లబ
బృందారక గొట్టు... 82

మ. కపివంశాగ్రణి యైనవాయుజునితో గర్వించి
గాండీవి మో,సపడన్ క్రీడికి బాగొనంగ హను
మన్ సాధించి పార్థధ్వజా,ధిపుఁగావించితి వక్ష
యచ్ఛదసమృద్ధిద్రౌపదీమానభం,గపరి త్రాణక
గొట్టు... 83

మ. దవమున్ బోలె మహార్షిభిక్షయని రాఁ దచ్ఛాం
తికై ద్రవ్యమున్, లవమాత్రార్పిత శాకపారణ
మువల్లన్ సేయవా తృప్తి! మే,ల్గవయం బ్రాణుల
కెల్ల ఖండనకళాఖండీభవద్దంతవ,క్ర విదూరాదిక
గొట్టు... 84

మ. కురురాజన్యుఁడు వాసవాత్మజుఁడు కోర్కుల్
మీఱఁగా నిన్ను సం, గరసాహాయ్యము వేఁడ
రాజునకు వేడ్కన్ సేనలంబంపి నీ, వరయన్
సారథివైతి వర్జునున కత్యంతాప్తిచేఁ గోటిభా,
స్కరతేజస్వికి గొట్టు... 85

మ. అమరం గౌరవకోటి కెల్ల పటుశౌర్యప్రౌఢిమన్
విశ్వరూ,పముజూపించుచు విందుసూతజుఁ డొన
ర్పన్ భోక్తవై రాయబా, రమువాటించిననిన్
భజింతు హితసంసారార్థలీలాధృతాం, గమ్ము
పాలౌకిక గొట్టు... 86

మ. అసమప్రౌఢిమ సైంధవుం గెడప దీక్షాయత్తుఁ డైన

ట్టియింద్రసుతుం బ్రీణితుసేయఁ దజ్జయనిమిత్త
వ్యాప్తికై యవిఘ్నభా, వసునిం గప్పితి వెంతవింత!
భజనాపారీణతద్ఘ్నాపవర్గసుఖప్రాపక గొట్టు...
మ. అమరం గర్ణుని నాగపాశమును ద్రోణాభీలది
వ్యాస్త్రముల్, సముదంచద్ధృతరాష్ట్రజృంభణ
ము గాంధారీవిచారాగ్నియుల్, గ్రమయత్నం
బులమాన్పి పాండవుల వేడ్కంబ్రోచినావార
భ,క్తమనోరంజక గొట్టు... 88
మ. విలసద్భవ్యభవత్తనూభవులకుల్ విద్యాగురుల్
మూఁడుకో, టులపై నెన్బదివేలమందియట తో
డ్తో వారికిల్ సంఖ్యసం, ధిలగాఁ బుత్త్రకు లెన్ని
యర్బుదములో నీకగ్రపుత్రీభవ, త్కులహంసా
శ్వక గొట్టు... 89
మ. ఉరుశౌర్యాఢ్యుఁడు రుక్మిణీసతికిఁ బ్రద్యుమ్నుం
డు నమ్మేటికిల్, వరపుత్త్రుం డనిరుద్ధుఁ డాఘనున
కావజ్రాభిధానాంకుఁ డీ, సరణిల్ వంశసమృద్ధిగ
ల్గిన మహాసంసారి వారార సా, గరజామాతృక
గొట్టు... 90
శా. నీజాగ్రత్స్థితి సాధురక్షణకళానిత్యంబు నీలీల
నా, నాజంతువ్రజజన్మపోషణలయానందంబు నీ
మాయ భా, షాజాన్యాదిదురాసదంబు యదు
వంశక్షీరవారాశిరా, కాజైవాతృక గొట్టు...

శా. ఆభీలాసురవంచితుం డయినబ్రహ్మన్ వేదవి
ద్యావున,ర్లాభామోదితుఁ జేయునీకు ఝషలీలా
మూర్తికిన్ దీనర, కూర్మాకారంబు వహించు టెంత
పని; హస్తన్యస్తగోవర్ధన, క్ష్మాభృత్కందుక
గోట్టు... 92

మ. రుచిరప్రేమ గుచేలు నుద్ధవుని నక్రూరున్ బరీ
క్షిత్తు న, మ్ముచికుందుం గరుణించినట్లు పరమా
త్మున్ గాంచనాంచన్మహా, విచయున్ నిన్ను భజిం
తు నెమ్మదిని లక్ష్మీనిత్యభోగానురా, గచిరంభా
వుక గోట్టు... 93

మ. అలబృందావనవీథి ధేనువుల నెయ్యంబారఁ
బాలించువే, ళల నీ వందోకగోవుగన్పడిన వెల్లం
దోలితో నేను న,ట్టుల నజ్ఞానిని నన్ను బ్రోవు మిం
కఁదోడ్తో భక్తరతాసమా,కలితారంభక గోట్టు.

శా. తోరంబైనమదీయభాగ్య మది యెంతో కాని మ
జ్జిహ్వాకున్, సారస్యంబుగఁ బ్రోలఁగాఁగలిగె
యుష్మన్నామచింతాసుధా, పూరం బాప్తతచేఁ
బ్రథానగరద్వాఃలోకవైకుంఠశ్రీం, గారద్వా
రక గోట్టు... 95

శా. సంప్రీతిన్ నినుసంస్మరించెదను మత్స్వాంతం
బులో నిల్వవే!, సుప్రజ్ఞానిధులైనభక్తులమదిన్

సొంపొప్పఁగా నీవు ని,త్యాశ్రప్రామాణ్యవిధిఁ వసిం
తువని యం డ్రంగీకృతాచత్పిశం, గప్రావారక
గొట్టు... 96

శా. నీసౌందర్యగుణంబు లెంతు మదిలో నిన్నే
నుతింతుఁ నెఱా, నీసంకీర్తనలాచరింతునను నీని
త్యానుకంపాసుధా, కాసారంబునఁ దేల్చు మిం
క కమలాగండస్థలీపత్త్రరే, ఖాసంలేఖక గొట్టు...

శా. వాలాయంబుగ నిన్నెకొల్తు నినుఁ గైవారంబు
గావింతు నీ, లీలల్ వర్ణనసేతు నీదుకథ లాలిం
తుఁ భవత్సత్కృపా, ప్రాలేయప్లుతుఁ జేయవే
నను రమారామామణీపాదలా, క్షాలిప్తాంబక
గొట్టు... 98

మ. నవనీతాత్తుఁడ వీవు నేఁగృపణుఁడఁ నన్నేల న
శ్రద్ధసే, యవిచారింపకుఁ బ్రేమనిల్పుము కరం
బర్థింతుఁ గైకొమ్ము మ, త్కవితారామము శౌన
కాదిమునిబృందస్వాంతమాకందవృ,క్షవిరాజత్పి
క గొట్టు... 99

శా. శ్రీమన్మూర్తివి నీవు నిఁ దలఁతు నీచే సంపదల్
గాంతు నీ, కైమోడ్పుల్ పచరింతు నీవలనమో
క్షప్రాప్తిసాధింతు నీ, కామోదంబుగఁ గూర్తు
నామనసు నీయందేసుమీ సత్యరే, ఖామాహా
త్మ్యక గొట్టు... 100

శా. శ్రీమత్కాశ్యపగోత్రదిట్టకవివంశీయాఢ్యుఁడన్
రామచంద్రామాత్యాంకుఁడ నీకథల్ శతకప
ద్యారూఢిన్ వ్రాక్రుచ్చితిన్, స్వామీ యీశతకం
బు గైకొనుము నీసామర్థ్య మత్యంతమౌ, గా మ
తోషక గొట్టు... 101

మ. పరగం గ్రిందటిజన్మజన్మముల నిన్ బ్రార్థింప
లేనైతి ని, స్సరరూపంబునఁ గొల్వఁగంటి నిటతో
నాకబ్బె సన్మక్తి సుస్థిరమై యర్జునసాహసార్థభగ
వద్గీతాగహాస్యప్రియం, కరవాచాలక గొట్టుము
క్కలపురాకా రాజగోపాలకా. 102

గొట్టుముక్కల రాజగోపాలశతకము
సంపూర్ణము.

# పీఠిక.

ఈశతకము రచించినకవి దిట్టకవి రామయోగి దీక్షితులు. ఇతఁడు కాశ్యపగోత్రుఁడు. నందిగామ తాలూకా గొట్టుముక్కలనివాసి. చిరకాల మీకవి నూజవీటిలో నారయప్పారావు బహద్దరువారి యాస్థానమునందుఁ బౌరాణికుఁడుగ నున్నటులఁ గవివంశీయులు చెప్పుచున్నారు. ఇక్కవి రంగారాయచరిత్రము రచించిన నారాయణకవిమనుమఁడు. ఈయనతండ్రి సుందరరామసూరి. తాత యాదవరాయకవి. జనకపితామహులప్రతిభావిశేషములు తెలియవు.

రామయోగికవి సంస్కృతమున నసాధారణపండితుఁడు. ఒకమా టీకవి తనప్రభువర్యునితోఁ గాంచీనగరమునకేగి యటనున్న మహాపండితులతో వ్యాకరణశాస్త్రమునఁ జాలదినములు వివదించి విజయమంది బ్రహ్మరథము పీతాంబరసత్కృతి నూటపదియాఱురూపాయలు సభాసత్కారము సేలువులు బహూకృతిపొంది గృహాభిముఖుఁ డాయెనఁట. నాఁడుమొదలు నేఁటివఱకుఁ గాంచీనగరవాసులు

ఆంధ్రులు విద్యావాదములలో గడుసరులనియు నెవరిచే జయింపఁ బడనికాంచీనగరపండితుల నాంధ్ర నియోగి జయించెననియుఁ జెప్పుకొనుచుందు రని కవి వంశీయులు చెప్పుచున్నారు. వ్యాకరణశాస్త్రపా రంగతుఁడును పండితోత్తముఁడు నగు రామయోగి రచించిన యీ శతక ప్రశస్తినిగూర్చి ప్రత్యేకముగా మేముచెప్పవలసిన దేమియు లేదు. ఇక్కవి సంస్కృ తమునఁ బెక్కుగ్రంథములకు వ్యాఖ్యానములు మతవిషయికఖండనగ్రంథములు రచించెను. కవి తన యుత్తరవయస్సులోఁ దనగ్రంథసముదాయముతో మచిలీపురమునందు నివాస మేర్పఱచికొనెను. ఉప్పెనవచ్చుటచేఁ గవివ్రాసిన గ్రంథములన్నియుఁ జరాస్తియంతయు సముద్రార్పితమైనదనియు నెటులో దైవవశమున రుక్మిణీపతిశతకముమాత్రము బైటప డినదనియుఁ గవివంశీయు లెఱింగించిరి. మాకులభిం చినరుక్మిణీపతిశతకమాతృక కొండపల్లి పీచుకాగి తములపై అగురుసిరాతో వ్రాయఁబడియుండెను. పుస్తకము ఒకటిరెండుమాఱులు సముద్రస్నానము గావించినటులె యుండెను. కొన్నిచోటుల వర్ణ ములు పద్యపాదములు చెరిగిపోయెను. కావుననే

పూర్వగ్రంథములన్నింటికిఁ బ్రత్యంతరములు వ్రాసి నలేఖకులు దీనిని ముట్టుకొనరైరి. ఇఁక నుపేక్షించిన యెడల నీపుస్తక మదృశ్యమగునేమో యని శ్రమ చేసి యథాశక్తిని శుద్ధప్రతిని సిద్ధపఱచి ముద్రణ మున కొసంగఁగలిగితిమి.

ఈకవివ్రాసిన రెండుశ్లోకము లొకజీర్ణపత్రము మీఁదనుండఁగ యథారూపముగ వ్రాసితిమి. ఈశ్లో కద్వయమువలన నీకవి సంస్కృతకవితానైపుణ్యము బోధకాఁగలదు.

శ్లో. మేఘస్స్వనీరదఘనాఘనతా ప్రసిద్ధి
స్సంపశ్య కేవలఘనం సరదం ప్రసిద్ధం
శ్రీనారయప్రభువరం సరదం ప్రసిద్ధం
సంపశ్య కేవలఘనం ముఖవర్ణ భేదీ
మోఘోభవ త్యనుపమోహి సరాజవర్యః.

శ్లో. విరాజతే తోకవిరాజిరాజతా
విభాకరే సంస్థితి మేతిహంసతా
సరాజహంస స్సమదీపిసర్వదా
సదాఖ్యయా నాదయ భూపవర్యః.

ఈకవి కాంధ్రకవితయందంతనైపుణ్యము లేదు. కాని సుప్రసిద్ధకవి వంశజుఁడును పండితోత్తముఁడు

నగుటచే నీశతకమును రామయోగి మనోజ్ఞముగ వ్రాసియున్నాఁడు. చిరకాలమునుండి మూలఁబడి యున్నయీశతకము శుద్ధప్రతి వ్రాసికొనుట కిచ్చి ముద్రణమున కనకాశము కల్పించినఁ గవితమ్ముని కుమారు లగుదిట్టకవి సుందరరామయ్య శర్మ పాకయాజి గారిని బ్రశంసించుట ధర్మము.

కవి రమారమి డేబది సంవత్సరములపై కాలమున నూజవీటిలో మరణించెను.

నందిగామ. 1-4-25 } ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీ ర స్తు.

దిట్టకవి రామయోగిప్రణీత

# రుక్మిణీపతిశతకము.

---

ఉ. శ్రీకర సారవాగమృతశీకర చారుకలాకరాస్యచా
మీకరచేల భీకర సమీకరమాకర వారిజాత
మైత్రీకర పాదపల్లవసుధీనుతమానిత దీనమా
నవా,నీక రథాంగబంధురజనీకరలోచన రుక్మిణీ
పతీ. 1

చ. జలధరనీలగాత్ర దనుజవ్రజకంఠఖనిత్ర కల్యవా
గలఘుసుపర్వరాణ్ణుతియుతాత్మవిచిత్ర చరిత్ర
వర్తులా,కలితకళత్ర పాపలతికాశితదాత్ర పతత్రి
నేతృప,త్త్ర లలితవక్త్ర సంకుమదరాజితచిత్రక
రుక్మిణీపతీ. 2

ఉ. బాల నిశాకరాకలితఫాల దయాసువిశాలలో
లనీ,లాలకజాల గైరికసముంచితచేల తమాల
భూమిజా,తాలలితాంగజాలపవయాన భవస్తుత
శీల దేవతా,పాల విరోధికాల శిశుపాలవిపా
లక రుక్మిణీపతీ. 3

ఉ. దండితవైరితండహిమధామ సముంచితతుండవా
జిర్వాట్కాండ విశాలకుండలయుగద్యుతిమండిత
గండసుప్తవేదండపిచండ సద్మగతదండక పాతక
సంతమిశ్రమార్తాంశ నమస్క్రియాపరసుధాశ-
నిమండల రుక్మిణీపతీ. 4

ఉ. భూసురవారతోష పరిపూర్ణసుధాసమభాష
దేవతావ్రాతసముదాయపోష జితఘోరతరాద్భు
తదోష భూషణోద్భాసితవేష దాసజనపంక
జపూష చతుర్ముఖాదిశస్త్రాసమసన్నిభ విబుధా
హితశోషణ రుక్మిణీపతీ. 5

ఉ. అంగజరూపసన్నుతసితాంగ విహంగతురంగ స
త్కృపాపాంగరథాంగసంగ పరిపాలితదేవకదంబ
మౌనిసారంగతమఃపతంగ కలుషాంగద భంగర
థాంగభీతిమత్సంగరరంగఖండితనిశాకరపుంగవ
రుక్మిణీపతీ. 6

ఉ. దేవ మహానుభావ ఖనదీధరసన్నుతభావ దైత్యవి
ద్రావ భయానకౌఘగదదావ సముంచితభూరి
కంకణారావ ముఖాంబుజాతవిసరన్నయ
భావ కరాంగుళీధృతగ్రావ దయాకటాక్షపరిర
క్షితసేవక రుక్మిణీపతీ. 7

ఉ. రక్షితనాగభాసురపరాగ భయంకరశౌర్యవేగ

సం, శితీతదైత్యపూగ మునిసేవితపాదపరాగ
సత్కటీ, కుకుణయోగ యోగబలఖండితకిల్బి
షరోగ రాగర, క్తకుపణానురాగ కృతదైవత
భోగక రుక్మిణీపతీ. 8

ఉ. రాజితతేజ గుప్తగజరాజమనోజ్ఞకళామనోజసా,
మ్రాజబిడౌజ వక్త్రసదృశాంబుజ రాజనికారిలోచ
నాం,భోజ దయాకటాక్షపరిపోషితగోపసమాజ
భక్తగో, భూజ గృహీతసర్వజనపూజ గదాగ్రజ
రుక్మిణీపతీ. 9

ఉ. కోమలనీలదేహ మునికుంజరనిర్మలచిత్తగేహ పు
త్రామితమోహ భక్తనివహాపదుషర్బుధవారివా
హ ఘో, రామరవైరిదాహ విశదానవవాహవి
పూరితవ్రజ,స్తోమలసత్సమీహ నతశోకతమోప
హ రుక్మిణీపతీ. 10

౧. చతురవచఃకలాప మణిచారుకలాప మనోజరూ
ప స, స్తుతిపరమేరుచాప పరిశోధితదారుణపాప
గోప దు, ర్మతిదురవాప ఘోరరిపురాడ్గతిగర్వ
విలోప శాపసం, హ్రుతమునితాప భక్తజనహ్రు
త్కమలాతపరుక్మిణీపతీ. 11

. పాతకకాననవ్రజనిపాతసుహేతి వినాశితామ
రా, రాతి మనోహరాకృతివిరాజితనాథవిచింతన

ప్రణ, త్రాతతభీతి వర్ధితపదాబ్జయుగా శ్రితమాన
వౌఘుస,దూర్భాతి ముఖాంబుజాతపరిభూతనిశాపతి
రుక్మిణీపతీ. 12

ఉ. విశ్వనివాస విశ్వకర విశ్వవిదూరక విశ్వవంద్య
యో, శాశ్వత విశ్వరూప భవశాసననిర్మలనిర్వి
కార లో, కేశ్వర దేవదేవ నిను నెంతటివాఁడ
నుతింప నోపత, త్ర్యశ్వపురాణపూరుష చిదాత్మ
నిరంజన రుక్మిణీపతీ. 13

ఉ. బంగరుచేలగప్పి సదపాంగవిలోకనలీలనొప్పి న
వ్యాంగదముఖ్యభూషణసమంచితవేషముతోడఁ
గూడి సా,రంగమునందుఁ బూనిననయంబున నా
కు భవత్పదాంబురు, ట్సంగతి నీయఁగోరెదను
సారసలోచన రుక్మిణీపతీ. 14

ఉ దండము గోపయోషావతకదంబకుచస్థలపత్రలేఖనా
ఖండచమత్క్రియాంచితనఖక్షతచందిరఖండలా
లిత, (?)త్కాండజలోచనావృతసకాశసుదేశలస
త్కువేల స,త్త్వాండవవర్తి నేత్రయుగతామర
సాంఘ్రిక రుక్మిణీపతీ. 15

చ. దరదరవిందలోచన సుధారసభాసురహాసయో
ధరా,ధరధర దారితారి జనతారక తారపటీరహీ
రకుం, దరసమరాళగౌర యశతామరసోదర

భక్తసాదరా, ఖరకరచారుతేజ భవకాననపావ
క రుక్మిణీపతీ. 16

ఉ. తమ్ముల కెమ్మెచే మలినదమ్మగు నెమ్మొగముం గర
మ్ము భ, వ్యమ్మగుసొమ్ము కెంజిగురుటమ్ముల వేలుపు
టమ్మకుం నివా, సమ్మగుంబొమ్ము నెమ్మిపురిసమ్మిళి
తంబగు వేణికుందదం, తమ్ములు గల్గుదేవ మిము
దల్చెద నెమ్మది రుక్మిణీపతీ. 17

ఉ. పాతకతూలసంహతికిం బావకకీల నిరంతరంబు కం
జాతభవాప్తబంధుపునిశాకరకోటికిం జిత్తభీకరం
బాతతభూతసంతతుల కానగణింపంగ నీదునామ
మా, రా!తలంపంగ రక్తకజరాజితపాదక రుక్మిణీ
పతీ. 18

ఉ వందనమాచరింతు సురవందితసుందరపాద దేవకీ
నందన భక్తచందన సనందముఖస్తుత మామనో
కశేం, దిందిర మందహాసమునం దీరగు తావకవక్త్ర
కంజ మిం, పొందంగంజూపు మీకనులనొప్పుగం
జూచెద రుక్మిణీపతీ. 19

ఉ. సంచితపుణ్యరాశి యగుచంద్రనిభానన నీవుగల్గం
గాం, గొంచెపుదేవతాతతులం గొల్తురు ధీబల
హీనతం బయో, దంచితగాంగసైకతమునందు
జలార్థము ద్రవ్వులీల స్వ,త్కాంచననూపురోల్లసి
త కమ్రపదాంబుజ రుక్మిణీపతీ. 20

ఉ. భక్తచకోరజాలపరిపాలనచంద్ర ధురావహాంబు
లై, దిక్తటసంచరద్రుచుల దీప్తములౌ భవదీ
యపాదసు, వ్యక్తనఖాంకురంబు లనయంబును
మామకచిత్తవీథి సం, సక్తత నొందఁజేయఁగదె
సారసలోచన రుక్మిణీపతీ. 21

ఉ. నందునియందు నాద్రుపదనందినియందు యశో
దయందు నా,మందలయందు మానిజనమండల
మందును భీష్మునందు నే,చందమునన్ గనంబ
డెనొ చక్కని మీకరుణాకటాక్ష మా,చందము
నమ్ము వైచ్ఛికము సల్పుము నీ విఁక రుక్మిణీపతీ.

ఉ. శంకరమిత్ర నీచరణసారస మాత్మ నిరంతరంబు
ని,శ్శంకఁ దలంచువారల కసాధ్య మొకించుక లేద
టంచు నే,భాంకరణంబు మీఱఁగ శుభంకరభేరి
గజంబు నెక్కి యా,తంకము లేక సాటెదను దార
గుణాకర రుక్మిణీపతీ. 23

ఉ. కోరితి మీపదాంబుజము కూరిమిచేఁ బరదేవ
తాతతిన్, జేర నదెట్లటన్న; మదసిక్తమతంగజగం
దమండలీ, చారుతరస్థితిం బరగు షట్పద మొందును
గాక యుజ్జ్వల,త్సైరిభ మొందునే వికచసారస
వాసన రుక్మిణీపతీ. 24

ఉ. మిమ్ముల నమ్ముకొంటి నిటమీఁద మఱెవ్వరి వేఁడ

నంటి మీ,తమ్ముల గేరు నెమ్మొగ ముదంచితరీతిని
జూపుమంటి నా,సామ్మునుసీవయంటి మధుసూద
న నన్గరుణింపుమంటి నా, నెమ్మది మీపదాబ్జముల
నిల్పుమటంటిని జానకీపతీ. 25

చ. గజపతిఁ బ్రోచినాఁడవని కామినికోర్కులొసంగి
తంచు స,ద్విజునికు చేలునేలితనివించు భవచ్చర
ణంబు వేఁడితిౕ, భజనము జేయువారలఁ గృపా
మతిఁ బ్రోచెడితండ్రి పాతక,వ్రజములడంచి బ్రో
వఁగదె పంకజలోచన రుక్మిణీపతీ. 26

ఉ. చల్లడముౕ జెఱంగు నిరుచక్కిఁజెలంగెడుధట్టి
జాళువా, పిల్లనగ్రోవి ముత్యముల పేరును మేల్బో
లనూలు మించులౕ, గల్లయొనర్చు కుందనపు
ఖండువయొప్పఁ గళిందజాతటిౕ, సల్లలితప్రచా
రములు సల్పినదేవర రుక్మిణీపతీ. 27

చ. పరమపవిత్రతావక సుపాదసరోజపరాగరాజి
సం,వరణధురీణతామహిమ భాసిలు గోపకుమా
రపేటికా, స్ఫురదురుభాగ్యరేఖల సమున్నతిఁ
బెంపునుతింపశక్యమే?, హరిహయ హేమగర్భుని
టలాతులకైనను జానకీపతీ. 28

ఉ. పంకజనేత్ర మీపతితపావననామ సుధారసంబు
నిశ్శంకత నానుసత్పురుషసంతతి కెంతపనుల్ పరే

తక్కాట్కింకరచక్రవాళకముగీటడంగించుట
క్షలక్ష్మీ చే, సంకలితత్వ మొందుటయు సార
చన రుక్మిణీపతీ.

౮. శక్ర విరించి శంభునుతి చక్రవిరాజిత
భూష ని,ర్వక్రపరాక్రమక్రమ నివారిత
భవల్ల సత్కరో, పక్రమణప్రభావము గ
మతి మాకు నొసంగుమయ్య యో,వక్రవి
సంతుషితనాగకులాధిప రుక్మిణీపతీ.

౯. నెమ్మది నమ్ముకొంటి శయనీకృతవేషఫణా
ప్రభా,సమ్మిళితాత్మదేహరుచిచక్రవిడంబితగొ
భిద్ధను,స్సమ్మహితాంబువాహ విలసద్ద్యుతిత
దివ్యపాదప,ద్మమ్ములు భక్తమానవుల దా
సొమ్ములు రుక్మిణీపతీ.

౧౦. దండము దేవదేవ హరి దండము కుండలదీప్తి
శ్,ద్గండ మహాత్మ యోవికచకాండజలో
యోముకుంద యో,దండితరాక్షసప్రకరదండ
దండము దండమయ్య యో,కుండలితల్ప వ
రుచి కోమలవిగ్రహ రుక్మిణీపతీ.

౧౧. నీరధిలోన భూరితరనిర్మలనై జరుగావళుల్ వ
చారుత మీఱఁజొచ్చి ఘనసారసమేత మ
త్కటత్రయీ, చోరక సోమకాసురనిషూ

తఁ దోలుపల్కులోలిమై, వారిజగర్భు నందిడిన
వారిచరాత్మక రుక్మిణీపతీ. 33

ఉ. కవ్వముగాఁగ మందరనగంబు భుజంగమరాజు
రజ్జుగా, నివ్వటిలం బయోదధి ననేకసురాసుర
కోటి మొత్తమై, క్రొవ్వునఁ ద్రచ్చుచుం; బిదపఁ
గొండలమందఁగ నద్రి కూర్మతఁ, నివ్వెఱఁ
గొందఁ దాల్చి కరుణించితి వారల రుక్మిణీపతీ.

ఉ. భీకరసూకరాత్మకత బిట్టదరంగ నజాండభాండ
ముల్, పీఁక ధరిత్రిఁజుట్టి యతివీరు హిరణ్యవి
లోచనుఁ మహోద్రేకముతో విఘాతమొన
రించి విషాణమునందు నీధరఁ, జోకయొనర్చి
పూని మునుచొప్పుననుంచితి రుక్మిణీపతీ. 35

చ. పటపటలీనఁ గంబమున బల్విడివెల్వడి శాతహే
తిను, త్కటనఖరాగ్రఘాతకలఘాతకశిప్వరివిగ్ర
హాంత్రసంఘటితశిరోధివై విబుధకంటకసూతిని
బ్రోచితీవెకా, పటునరసింహరూపత సుపర్వులు మె
చ్చఁగ రుక్మిణీపతీ. 36

ఉ. వేదపురాణశాస్త్రముఖవిద్య నమేయత దేవతావ
నా, పాదనమందు వామనత బాగుగఁబూని పద
త్రయంబు న, హ్మోదముతోడ దైత్యకులము
ఖ్యబలీంద్రుని వేఁడి లోక మ, త్యాదరణంబునఁ
బలికి నర్పణజేసితి రుక్మిణీపతీ. 37

చ. పరువడి రాజసంఘములఁబట్టి కఠోరకుఠారధార
తోఁ, నిరువదియొక్కమాఱువధియించి భయంక
రతత్తనూత్కరోత్కరదురక్తపూరదివిపన్న
దిఁ బైతృకతర్పణంబు నిం, పరయఁగఁజేసి భార్గ
వతభాసిలితౌగద రుక్మిణీపతీ. 38

ఉ. దేవతలుబ్బఁగాఁ బిత్రుని దేశమునన్ బహుజం
తుసంతతోఁ, గ్రావనికేఁగి యందనుచరాయితవా
యుసుతుండవై లస,ద్రావణకుంభకర్ణ ముఖరాక్ష
సవీరవినాశనంబు స,ద్భావతఁజేసి రాఘవతభాసిలి
తౌగద రుక్మిణీపతీ. 39

చ. హలహతిచేఁ గళిందతనయాపరిభేదనమాచరించి
దో, ర్బలమలరంగ దుష్టమతి బాలిశధేనుకము
ష్టికాసురా, విలయమొనర్చి లోకములవిశ్రుతిఁ
జెందినయోగ్రసాధనా, కలితకరుండవై బలతఁ
గాంచినదేవర రుక్మిణీపతీ. 40

ఉ. సుందరరూపతాఁ త్రిపురసుందరులన్ వరియించి
బౌద్ధతన్, బొంది రయంబునన్ ద్రిపురపూర్వసు
పర్వులఁ జంపునప్పుడా, చందురుదాల్చు దేవరకుఁ
జాపశరాసనసాధనంబులా, నందము మీఱఁగా
ననివొనర్చితివౌగద రుక్మిణీపతీ. 41

ఉ. తురగము నెక్కి ఘోరతరదుష్కృతసాంద్రమలీ

